॥ ఓం ॥

౦ ౧ ౦

# స్వయంజ్యోతి.



శ్రీ మొక్కపాటి అచ్యుతయ్య

విరచితము.

రామినేని రాజయ్యచే

ప్రకటితము.

బ్రాహ్మణకోడూరు.

---

తెనాలి పాప్యులర్ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

# జ్ఞానామృతము

## అన్ని ఉపనిషత్తుల సారము. వెల **0-6-0.**

ఇయ్యది అన్ని ఉపనిషత్తులనుండి సమకూర్చి వ్రాసిన సారాంశము. మానవుని జీవితోద్దేశ్యము సాఫల్యపరచును. భక్తి, జ్ఞాన, వైరాగ్యవిషయములలో శంకరులవారు, రామానుజులవారు, మధ్వాచార్యులవారు బోధించినవిషయములు, పరిశీలించి భావములను పామరులకు సహితము తెలియునటుల తేట తెనుగున మృదుమధురశైలిలో, వ్రాయబడినవి. ఉపనిషత్తులయందు అందందు వెదజల్లబడి యున్న రత్నములను, ఒకచో హారముగ సమకూర్చి వ్రాసిన గ్రంథము, ఆంధ్రమున నిది యొక్కటియే యని చెప్పుట అతిశయోక్తి కానేరదు.

మీ కేపుస్తకములు కావలసినను ఈక్రింది అడ్రసుకువ్రాయుడు.

సుందర రాం అండ్ కో., రిజిష్టర్డు, తెనాలి.

పబ్లిషర్సు, బుక్ సెల్లర్సు.

# ౦ ఓ ౦.

## తొ లి ప లు కు.

కలలో ముచ్చట్లుగా కలముచ్చట్లనే ఈ గ్రంథముగ వ్రాసినది **నామేనకోడలు** మొక్కపాటి అచ్చమాంబ. తల్లి దండ్రులు అంచా రామాంబా, కోటయ్యలు. భర్త కోటయ్య, కుమారుడు పన్నెండు ఏండ్ల వెంకటరత్నము. భర్తృ వియోగాదిగా **మాతాసుతు** లామె మేనత్త **మేనమా** మలగు రామినేని నరసమ్మ బ్రాహ్మణయ్యల పోషణలో నున్నారు. ఈమె చిన్నప్పటినుండి స్వయంకృషిగా వైరాగ్యముగా నాధ్యాత్మ విషయిక పరిశ్రమ చేసెను. గ్రంథ్యస్థాన [illegible] దినదో లేదో పెద్దలకే యెఱుక. [illegible] వలయునని కోరిక లేదుగాని ప్రాణస్నేహితు[illegible]లు కోరినందున కొన్ని విషయములు వ్రాసినది. ఆవిషయములు [illegible] ఆదిరాజు తిరుమలరాయల శిష్యురాలగు ద్రోణాదల తిరు[illegible]ంబగారు. శివబ్రహ్మంగారువగైరా పెద్దలమధ్యలోబడి యీలాంటి స్వయంకృష్యానుభవములు ప్రకటింపబడిన జిజ్ఞాసులకు, సాధకులకు ప్రయోజనకారియని ప్రోత్సాహపఱచుటచే ఆమెకు దెలిపి యొప్పించి పెద్దవారి యనుజ్ఞప్రకారము ప్రచురించితిని. పెద్దలే దీనికి "స్వ యం జ్యో తి" యని పేరిడిరి. స్వానుభవజ్ఞులు "స్వప్నేప్రతీయమానాని రూపాణి యథాతథా" యను నట్లీ లోకమును స్వప్నతుల్యముగాజూతురుగదా. అట్లె యీమెయు నాదృష్టిలోనే యీవిషయములు వ్రాసినది.

బ్రాహ్మణకోడూరు,<br>శ్రీముఖ సం॥ మార్గశిరం.

ఇట్లు విధేయుడు,<br>రా మి నే ని రా జ య్య.

౦ ఓం ౦.

౦ ౧ ౦

# స్వయంజ్యోతి

శ్రీ సద్గురు మహారాజుకు జై.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥
బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ।
యస్యాంతర్నాదిమధ్యం నహికరచరణం నామగోత్రం నసూత్రం ।
నోజాతిర్నైవవర్ణో న భవతి పురుషో న నపుంసో న చ స్త్రీ ।
నోకారం నోవికారం న జనన మరణం నాస్తిపుణ్యం నపాపం ।
నోతత్త్వం తత్త్వమేకం సహజసమరసం సద్గురుం తం నమామి ॥

## 1. మహామాయా కథ.

కలవచ్చింది. ఆకలలో తల్లి, తండ్రి, ఒక కొడుకు ముగ్గురు కుమార్తెలు వచ్చిరి. చిన్న కొమార్తెయన్న తండ్రికి ఒహుప్రేమ. స్కూలుకు పంపినారు. మొదలు అయ్యగారిని చూస్తేనే నాకు భయం. ఎంతో భక్తితో వెళ్ళుదానను. నాలుగుతరగతులు చదివినాను. ఒకనాడు భారతము చదివినాను. అప్పటికి పన్నెండు సంవత్సరములున్నవి. సాయంకాలము మైట చల్లగాలికి పండుకున్నాను. ఆకసమున కేసి చూచితిని. బహు నిర్మలముగానున్నది. నక్షత్రములు కనబడుచున్నవి.

అప్పుడొక యూహతోచినది. క్రిందభూమి, పైన ఆకసము చూచుసరికి భారతముగుర్తువచ్చినది. ఈలోకములకల్ల త్రిమూర్తులుగదా ఆధారము. ఈముగ్గురు ఒక్కరివల్ల తోచిరిగదా! ఒక్కడు ముగ్గురిని యెందుకు చెయ్యవలె. ఈముగ్గురులోకము లెందుకు జెయ్యవలె. లోకములో అవస్థలేమి. చావటమేమి. పుట్టుటయేమి. ఇది అంతా యెందుకు. ఈ మర్మము యెట్లా తెలుస్తుంది. అని ఒక అరగంటసేపు తర్కించుకొంటిని. అంతా వూహ యెటో మాయమైపోయె.

పదహారు సంవత్సరములకు ఒక్కకుమారరత్నం వెంకటరత్నం కనబడెను కనబడిన పదినెలలకు అహంకారముచే అలంకరించుకొన్న అలంకారము అహంకారముచేతనే తీసివేయబడెను. తర్వాత యెనిమిది నెలలకు నాప్రేమాస్పదమైన తండ్రి యీ కలనుండి మేలుకొనెను. అలంకారముకన్న తండ్రి బాధయే యెక్కువయ్యెను. తండ్రికన్నను అలంకారమన్న యెందుకు తక్కువప్రేమ అని ప్రశ్నరావచ్చును. భక్తిశ్రద్ధ లేక కాదు. ప్రపంచమన్న, కామరాగాదులన్న బహువిరక్తి కాబట్టి కల వున్న న్నాళ్లు వుండవలసినదానియందు బాధతగ్గినది. నాతండ్రియన్న ఒక్క నిముషమైన నేను కనబడినప్పటినుంచి నాక్షేమముకొఱకై ప్రయత్నించాడు. ఆప్రేమను యిన్ని విధములని చెప్పవలపికాదు. కనుకనే చింతయెక్కువ. ఇరువది మూడు సంవత్సరములు వచ్చుసరికి మఱువలేదు. తర్వాత ఒక మార్పు కలిగినది.

లోకమంతా అనేకరకములుగా భక్తిజేయుచున్నారే, కలలో నేను తెలివి వచ్చినది మొదలు భగవంతుని భక్తిజేయు చుంటినే, భక్తికి తోడుగా కష్టమెక్కువైనది. అయినను కష్ట సుఖములు శాశ్వతములుకావు. భక్తియే శ్రేష్ఠము గనుక ఆ భక్తిలో యేకాంతభక్తి ముఖ్యమని నిశ్చయించుకొంటిని. భగవంతు డావువెంబడి దూడలాగు భక్తులవెంట దిరుగునని నమ్మి యుంటిని. అదియునుగాక నీవే గురు రూపముగా దర్శనమిచ్చి కృతార్థురాలను జేయుమని కోరితిని. కోరిక యేమనగా " నా తత్వము తెలియనిది జనన మరణ ప్రవాహము దాటలేరు " అని యున్ని గ్రంథములు చెప్పుచున్నవి. కాబట్టి నీతత్వమనగా నేమో నీవేవచ్చి తెలుపవలశినదే గాని నేను దేవులాడ లేను. అని ప్రార్థించుకొనుచుయుంటిని. ఉండగా లోకములో వాడుక పుత్రునివల్ల సద్గతి దొరకునన్న వాక్యము నాయందు నమ్మకమైనది. కుమారరత్నము వొకటరత్నము మూలంగానే నాయిష్టదేల్పు దర్శనమైనది. భగవంతునికి రూపము లేదందు రేమో! మొదలు సాకారముగా కనుబడి తరువాత తాను తన భక్తులుఅంతా ఒకరూపమే అగుదురు. కాబట్టి ముందు లీలగా అట్లు కనుపించును. అట్లా లీలగా కనుపించి భక్తురాలు అనుగ్ర హమునుపే చెప్పనారంభించెను. ఎందువల్లననుకొందురేమో! ఆభక్తి యట్లా చేసినది,

ఏమని చెప్పెనంటే ! నేను స్త్రీస్వభావంగా అజ్ఞాన దశలో నున్నానని; నీవు స్త్రీవిగావు పురుషుడవుగావు, బుద్ధి గావు, చిత్తముగావు, అహంకారముగావు, పిపీలికాది బ్రహ్మ

పర్యంతము కళకళలాడుచు అణుస్వరూపముగా యున్నావు. నీకు విడిగా జగత్తులేదు. జగత్తుకు విడిగా నీవు లేవు. — "నేను స్త్రీనిగాను. పురుషుడనుగాను. రూపముగాను. రసముగాను. బుద్ధిగాను. చిత్తంగాను. అహంకారముగాను. నేను సచ్చిదానంద స్వరూపిణిని." అని కొంచెముసేపు అనుకొని హాయిగా యుండుమని, వానియర్థములు తెలియునట్లు చెప్పి దీవించి అంతర్ధాన మయ్యెను. ముందు సంతోషము వెనుక దుఃఖము అన్నట్లుగా ముందు అది యిది నన్నలము కొనెను.

కొంతవరకు తెలివి దెచ్చుకొని మెల్లగా సంచారము జేయ నారంభించితిని. రామలక్ష్మ ... యిద్దరన్నదమ్ముల దర్శనము జేసితిని. వారు నామాటలువిని మాకన్న నీవే మిగులుగా వున్నావు. అయినప్పటికి గురువులేని విద్య కూడదు. దాసుగారంటి గురువు అయితే కడతేరుతావని చెప్పిరి. నాకేమో యిష్టములేదు. వారికి తెలియదనికాదు. ప్రత్యక్షమయిన భగవంతుడుండగా నేనెక్కడో భగవంతు డున్నాడని యెందుకు బోవలెనని సమ్మతింపక పోతిని. ఇంకా కొందఱు యిట్లాగే నీవు తెలివిగలదానవు. నీకు యీస్వాముల వారయితే దబ్బున అందుకుంటావు. కాలము వ్యర్థముగా పోనివ్వకుమని చెప్పిరి. వీరందరు మంచి మహనీయులేగాని మనసెక్కడ నున్నది? ప్రత్యక్షభగవంతునియందు లీనమై తరంగ తరంగాలుగా తలంచుకొని పుప్పొంగుచున్నది. ఎందువల్లనంటే యీ మహనీయులంతా వారి దగ్గఱకుబోయి ప్రార్థనచేస్తే ముఖము చూచేవి కష్టము కాబట్టి. నామహనీయులు అట్టి

వారు గారు. దేహము లేనట్టివారు. ప్రపంచమనగా కలగా వున్నట్టుగా లేనట్టుగా చూచుకొనేవారు. కనుక ముందుకు వెళ్ళి కాళ్ళు గడిగి శిరమున నీళ్లు జల్లుకొని పూజ నమస్కారములు చెయ్యకుండానే నిజబోధను " నీవు, గ్రహించే జ్ఞానమని, అది మనోతీతమని. అవస్థాత్రయసాక్షియని, అన్నిజీవ రాసులలో యేకరూపానుభవముతో నున్నది " అని చెప్పి అదృశ్యులైరి. అదిమొదలు సర్వాత్మభావనతో ప్రపంచ మంతా నిండియున్నట్టి యనుభవముగా అదే ధ్యానములో నిమగ్నమై పోతిని.

ఇట్లుండగా హఠాత్తుగా మళ్ళీ దర్శనమైనది. గ్రుడ్డివానికి కన్నులు వచ్చినట్లుగా, పేదరాలికి ధనమువచ్చినట్లుగా, ఒకటని యేమి చెప్పేది? మితిమీరిన ఆనందములో నోలలాడితిని. ఆస్థితిలోనైన బాహ్యభక్తి జెయ్యనేరకపోతిని. భక్తి జెయ్యడ మెట్టిదో యెఱుగనైతిని. పరమార్థచింత తప్ప భక్తి చేయుటే తెలియదాయె. అప్పుడు తానే భక్తివిషయమై బోధించెను ఇంకా యేవిషయము తెలియదోయని యతిప్రేమతో ప్రతి విషయము బోధించెను. కాని నాకు యేది తలకెక్కలేదు. మనస్సులేకున్న లోకాలు మాయమగును. అని ఒకమహా మంత్రము చెప్పిరి. తనతాతగారు భాగవతుల కృష్ణదాసుగారు చేసిన " శుద్ధ నిర్గుణ తత్వకందార్థదరువు " లను గ్రంథములోని యమృతసారమును, మాతాతగారు ఆదిరాజు తిరుమలరావు గారు చేసిన "అచలరహస్యప్రదీపిక" అను గ్రంథములోని ఆనంద సారమును, మల్లాది వెంకటనాగభూషణముగారును తాను

రచించిన "శాంతిదాసుక శతకము, శ్యామాపురాణము, గురు లీల" యను గ్రంథములలోని బ్రహ్మానందసారమును, ఆత్మీయ సోదరుడు శేషంరాజుగారు వ్రాసిన 'ఎఱుకపాట' అను శేషానుభవములోని వాక్యసారమును జూపి, పుష్పచాపులు రెంటిని దూరించు కోమలహస్తమును శిరమున నుంచి. శ్యామామంత్రోపదేశము చేసి, ఆ రహస్యము తెలిపి, సమస్తము శ్యామగ శ్యామా విలాసముగ హృదయగతము గావించిరి. సర్వమదేగాన, తానే గురురూపమని, శిష్యరూపము తనదేనని, అనేవారు. వినేవారు, కాదనువారు, అవుననువారు. గురుస్వరూపమే, జ్ఞానస్వరూపమే గనుక ఇంకా నీవే ఆ గురుస్వరూపము, జ్ఞానాకారము గనుక నీకు మించినదేదిలేదు. నిన్ను కానిదేది లేదు. అంతా నీవే. అదియు స్వప్నప్రాయముకేగాని నిజముగా లేదు. అన్ని బోధలు సుబోధ క్రీడివేగాని వేరైవి గావు. వై బోధగాని, క్రీడబోధగాని, యన్నియు శ్యామాపాంగ లీలగా వున్నప్రాయముకే గాని లేవు. ఉన్నది బట్టబయలు. కదలదు. మెదలదు. దానికి నామరూప క్రియలు లేవు. దశలు లేదు సంతోషము లేదు. ఏమి లేదు. అంతటదే. సర్వమాక్రమించి యున్నది. ఇంతకు మిక్కిలి లేదు. ఇదే పరమ రహస్యము. ఇదే నిష్కళంకతత్త్వము. ఇదే నిరాకార నిరంజన నిర్గుణ పరమతత్త్వము. ఇదే ముమ్మాటికి నిజము! కనుక లేని దశను పరికించి చూడుమని తెలియజేసి, ఏకమైనటువంటి ప్రేమామృతసారముతో బుజ్జగించి, బ్రహ్మాండములన్నియు నీవే గదా! పిండాండములన్నీ నీవేగదా! అంతా నీకు సంశయము లేదుగదా! అని నమ్మ చెప్పిరి. తెలిపిరి.

అప్పుడు నేను పొందిన బ్రహ్మానందస్థితి జెప్పనలవిగాదు. ఏమి జెప్పుదు. ఎంతటి మహానీయులును జెప్పలేని స్థితిని నేనేమి జెప్పుదును. ఆ నిర్విషయానందమును, పాపరహితమును, కళంకము లేని యమృత సారమును, అనుభవము గాని యను భవమును గ్రోలి మితిలేనిఆనందముతో నిమగ్నుడై యొడలెఱుంగక ఆనందవీచికల నోలలాడితిని. లేనిచిత్రంలో అంతా వినోదముగా లీలగా గురుమూర్తియే ఆడుచున్నాడను విశ్వాసమునే నమ్మితిని. ఈ పరమలోకైకమూర్తిని (జ్ఞానస్వరూపమును)క్షణమైన విడువలేకపోతిని. అన్ని భ్రాంతులను వదలించుకొనుట చేసితినిగాని యీ మహామహానియందు(జ్ఞానానుభవమునందు) భ్రాంతిని విడువజాలక హృదయమందు క్షణము యేమఱక సకలము శ్యామా విలాసముగ భావించుచు సదా ఆనందమును ద్రావుచుంటిని. ఎందువల్లనని సందేహించుటకు వీలులేదు. ఆ పరమదశ యొక్క మహామాయయొక్క నటన యింతియే. ఈ మహానీయుని కేమి సమర్పింతును. ఏమియు నక్కర లేదు. ప్రపంచాతీతునకు ప్రపంచములోనివి యేవి యిత్తును. నా ప్రియమైన సద్గురుమూర్తి పరమాత్మయొక్క మహాలీలవల్ల హృదయమే అర్పించితిని. వెంటనే జగమేది ? అర్పించుటకు నే నెవరని చెప్పేది. కనుక ఎంతసేపు కలలో యున్నట్లుగా యుండి యనుభవము చెప్పుటకు ! చెప్పువారు, వినువారు అంతా మెలుకేకదా. ఎఱుక వున్నట్లుగావుండి పోనే పోవును గదా. ఉండి లేనిదానిలో యనుభవమును, ఎఱుక మాత్రపు దశను, ప్రపంచాతీతమును, హృదయానందమును, ఆనందరస

మును, దలంచి తలంచి హృదయమగ్నులై పోవుటయే గాని యిక నేమి చెప్పగలరు చెప్పుమనే దెవరు ? ఆనంద మెవరు? అంతా ఆ పరమాణువు యొక్క మహాత్మ్యమే కదా ! ఇవియు నున్నట్టులుండుటే యని యనుటయు, అంతా గురుమూర్తి యొక్క ప్రజ్ఞానముయొక్క లీలయే కారణము. గురువు శిష్యులయొక్క నేర్పరితనము. తల్లి మంచిదయిన బిడ్డలు మంచివారగుదురు. ఇక్కడ సద్గురుమూర్తి యెట్టివారయితే వారిశిష్యులు అట్టివారే అగుదురు. అట్టివారు ఇట్టివారుఅని అనుకోవడమేకాని యెట్టివారు యెక్కడలేరు. తోచుట పోవుట వాంఛక. తోచిపోయే దానిలో ఎవరువ్రాసిరి. ఎవరును లేరు. గురుమూర్తియైన ప్రజ్ఞానమైన శ్యామా లీలయే యిట్లు పరిణమించినది. ( అని అనుభవజ్ఞులకు దెలియును. )

మూర్తులయందు ప్రేమ లేకపోవుటకు కారణమేమి యని ప్రశ్నవచ్చె — వారియందు ప్రేమలేకపోలేదు. తమ్ము తాము దెలుసుకొని సానందులై లీలామాత్రముగా చరించు మహనీయులని ప్రేమించుచునే యుంటిని. కాని దైవములని భక్తి లేదు. అయితే చిన్నప్పటినుండి మహేశ్వరుని శ్రీరామ చంద్రుని భక్తి చేయుచునే యుంటిని. సంసారములు లేక చరించువారి సేవవలననే నాకును వియోగవిరాగములు కలిగిన వని గట్టిగానమ్మినయ్యెను. వారిని సేవ చేయుచుంటినేగాని యే బాధలు తప్పవయ్యెను. అదియునుగాక త్రిమూర్తులకు ఆధారము పరమపురుషుడనియు, పురుషోత్తముడనియు, ఆద్యంత రహితుడనియు, నిరాకారుడనియు, నిర్గుణబ్రహ్మమనియు ననేక

గ్రంథములలో నుండె. అందు సీతారామాంజనేయ సంవాదము భగవద్గీత, శుకబ్రహ్మకైవల్యమునందు సాంఖ్య తారక యోగము లకన్న ధ్యానయోగమే శ్రేష్టమనియుండె. సాంఖ్య తారకములు యెందువల్ల తక్కువయని ప్రశ్న రావచ్చును. ఎందువల్లనంటే తక్కువేమి లేదుకాని వస్తువును నిరూపించుటలో దూరముగా నుండి చెప్పుకోవడము. ధ్యానయోగమన్న ఉన్న దానినిగుర్తించి మాయమగుదశ. కనుక అన్ని యోగములకన్న ధ్యానయోగము కావలెననే వాంఛ. ఇంతేకాని ఎవరిని అడుగలేదు. అవునా కాదాయని మనస్సు విమర్శన చెయ్యడమే కాని యెవరిని యడుగలేదు. ఎవరిని అడుగకుండా నీకుదృష్టమేమి యని ప్రశ్న యితే! ప్రహ్లాదుడు, ధృవుడు, యెవరినియడిగి భగవంతుని ప్రత్యక్షము చేసుకొనినారు. ప్రహ్లాదునికి తండ్రియొక్క పట్టు దలచేత ప్రత్యక్షమయ్యెను. ధృవునికి సవితితల్లి యవమానము చేత ప్రత్యక్షమయ్యెను. వీరికి అవమానముచేత మనసు విరాగముచెంది పరమభక్తులైరి. జానాబాయి యనుచిన్నపిల్ల మనసుకు వైరాగ్యమెవ్వరు బోధించిరి. ఆలాగుననే స్వభావసిద్ధముగా మారవలసినదేగాని, దేశములు తిరుగుటచేతగాని, తీర్థయాత్రలచేతగాని, ఉపదేశముచేతగాని, వైరాగ్యముసిద్ధింపదు. కాని మహావైరాగ్య సంపన్నులై సదా శాంతమనస్కులై జగము కలగా, ఆ కలవున్నదో లేదో వూహించి చెప్పలేని పరమ ఉత్కృష్టదశనుగాంచు జ్ఞానరూపులగు మహనీయుల దర్శనము దివ్యకటాక్షమొక్కసారి తటస్థపడిన సర్వపాపములు హరించును. పాపమనగా అజ్ఞానదశ. అజ్ఞానమువదలి పరమా

ర్థదశనొందును. ఆలాగుననే యీ కలలో వారందరు యెట్లు మేలుకొనిరో ఆవిధముగనే మూర్తులును మేలుకొనినవారే. అందుచే వారియందు ద్వైతబుద్ధి లేకపోయినది. లేకపోవడము, ఉండడము, యివియంతయు యెఱుకయొక్కటియే. గురుమూర్తి యొక్క శ్యామాలీలా విశేషమేగాని యింకొకటికాదు. ఇన్ని రకములుగా యిన్ని యుగములుగా యింతవిచిత్రముగా నున్న సృష్టికిని లేనివికారమే. ఈ వికారముచేతనే తలంపులన్నియు అడుగంటినవి. ఇంతేగాని యేదియునిలుచునదికాదు. కాబట్టి ఆకలలో అందరివలెనే నేను ప్రత్యక్షమైన భగవంతునివల్ల కడతేరితినని ఆనందించుటమేగాని, అంతయు మాయికమే. అనునది, విన్నది, అంతయని యింతయని యెరుగకు. అంతయునున్నట్లున్నదే! ఓం శాంతిః! జయ్ సద్గురు!

...—...

## 2. మాయాతరంగిణీ కథ.

కలవచ్చినది. ఆ కలలో ఒక నెలతవచ్చె. లోకముసత్యమనితలచె. కష్టసుఖములకు తల్లడిల్లుచుండె. ఎందుకు యిట్లా అనిపించాలె అనితలంచె. దేవుడీక్షేత్రాన్ని కల్పించి యింత మాయగా ఎందుకుసృష్టించాలె అనిఅనుకొనె. ఆదిలో యీ జీవులను ఎందుకుకల్పించాలి యనియనుకొనె. దీని రహస్యం తెలియదాయె. చెప్పువారెవరు. ఎవరినన్నా అడుగుదామా అనితలంచె. అందరు సంకల్పము కలవారే. లోకములో గురువులకొరకు ప్రయాసపడుట, శిష్యులకు గుణములు వదలిపెట్టే సత్తాలేకపోవుట చూచుచుంటిని. అందువల్ల మనగుణములకును

రనిదే గురువువల్ల లాభమేమని నిరుత్సాహముతో నుంటినిగాని ప్రయత్నము మానలేదు. అంతట భక్తులను యుక్తులను శివ రాములయందు లక్ష్యముఃనిలిపె. త్రిమూర్తు లొక్కటేనని భేద ములేకపోయె. అందులో శివునియందు ధ్యానము. మూడవ నేత్రము పాములులేని శివుడు గాన్పించుచుండె. ధ్యానించు చుండె. కొందరు పరవశత్వ మాట చూచె. వారుభజనలు చేయుట పడుటచూచె. ఎట్లావీరికీ దశవచ్చునని ఆలోచించె. బాల్యములో అల్లిబిల్లి తిరిగినప్పుడు నరములుకదిలి మత్తుగా వచ్చిపడుట జ్ఞప్తికివచ్చె. ఇది అంతేనని యెంచి అనుభవము వల్ల నిజమని యనుకొనె. ఆదశలో శివుడు తాను లేకపోయె. అయోమయ మాయె. తెలివి యున్నంత వరకు నామ రూప జగములుండును. తెలివిలేనప్పుడు అయోమయమని నిశ్చయిం చుకొనె. దానినేల నిరామయమనరాదు ? మనస్సు జగత్తులు లేవుగదా. అంతేనని ఆరూఢముగ తెలుపువారెవరు ? తెలివి లేకున్న నేమియు లేదన్న సంగతిఅప్పుడు తెలియఁదయ్యె. అనేక సార్లాఅవస్థ కలుగుచుండె. పైత్యభ్రమ కాదు. లోకాలు మూర్తులు సంకల్పమున్నంతవరకు సుఖదుఃఖాలు భక్తులు భజనలు సేవ చెయ్యటాలుంటవి. ఇనుమైన బంగారమైన బంధము బంధమే. అని లోకాలయందు ధ్యానములేకపోయె.

లోకమంతా కళకళ లాడుతూ వున్నది. అన్నిమారు తున్నను ఆ కాంతిమారుటలేదు. చీకటిలో రాత్రిలో సూర్యు నిలో పిపీలికాదిబ్రహ్మపర్యంత మాకాంతివున్నది. మెరుపుదీప మొకటైనా బుడ్లన్నిటిలో ప్రకాశించుచున్నది. బుడ్లు వేరు

వేరు రంగులు కలిగివున్నవి. ఆలాగే ప్రపంచములో అన్ని రూపాలు బుడ్డవలె, వున్నవి. అంతటనున్న గుర్తుగా సచ్చిదానందరూప భగవంతుడు ప్రకాశించుచు వుంటేనే, యివి కాంతిగానున్నవని తలంచె. కృష్ణుడు రూపాలు మాయికమని, నిరాకార భగవంతుడు క్షేత్రములన్నిటియందు క్షేత్రజ్ఞుడైయున్నాడని చెప్పుటచూచెను. అదినమ్మకమయ్యెను. జీవుడు విడిగా లేడు దేవుడే. ఆదేవుని తెలసినను తానుదెలసినట్లే. కాన ఆదేవుని దివ్యజ్యోతిని తెలియాలెనని తలంచె. గట్టిగా ప్రయత్నించె. జ్ఞానేంద్రియాలు సంకల్పముతో వుంటే, మనస్సు యిటువంటొక్కి యీలోకముచూస్తుంది. సద్రూప దృష్టితో యిలా వుంటుంది. ఆ దృష్టి లేకపోతే, యేమియనుభవమని ఆలోచించె. అనాహత కమలాలు ఆ స్థానములు అందుండు దేవతలు ఆయా స్థలములభావించె. అవి లాకాన్నించె, ఏస్థానముదగ్గర ఆలోచన వుంటే క్రింది దేహము మరుపునకువచ్చె. కంఠస్థానములో తనమాయా మనుష్యరూపు చూచె. భ్రుకుటి స్థానములో పాములు మూడనకన్ను జటాజూటములేనట్టి నవ్వుచున్న శివుని చూచె. ఆస్వరూపము దేహము మరచె. తర్వాత సహస్రారము దానిమధ్య సూక్ష్మమైన అంతులేనిదివ్య కాంతిని లక్ష్యము చేసె. కాంచె. అనంతరము మనస్సు లేదు. ఏమిలేదు. తరంగ తరంగాలుగా యొడలు జల్లుమనిన కలిగేయానంద మగుచుండె. అమోఘానుమే అయ్యె. ఏమిలేదు. అమనస్క మేలకాదు? అనుభవము లెరుంగునంతవరకు నేనున్నాను. ఎరుగుచున్నాను. నేను వీని అతీతమును. అవిఅనుకుంటే కనుపడునని, అనుకోక

పోతే కనుపడవని, నిర్ణయము చేసుకొనె. ఆ అయోమయావస్థను, ఆనందముతో కూడినదానిని, మరువలేదు. దానిని తలంచిన దేహముమరచుట, ఆనందముకల్గుటజరిగె. ఇదే నిరామయ నిజస్వరూపమేమో యని యనుమానము కలిగె. తెలుపువారెవరు ? ఎవరిని అడుగలేదు. జగత్తు సంకల్పములు లేనిదశ అది. చా లా వి ం త యి న ది. అ ం త ట ఆ సంకల్పము సో హ ం భా వ న చే త ఆపుతారని, ఆ సంకల్పము నిలిపితే నిరామయావస్థ వచ్చునేమోనని భ్రాంతిపడినా. ఉశ్వాస నిశ్వాసములతో సోహంజపించుచు తదేకాగ్రముగా లక్షించుచుండగా శాంతముగానున్నదికాని యిది సంకల్పములో లేనిదే. తక్కువదే. అల్పమే. నేను మనోతీతమును. ఇది యొకభ్రమ యని తెలుసుకొని దానిని ఆపె. చెవులలో వ్రేళ్ళు పెట్టుకొని ధ్వనులాలకించగా ఘంటయొక్క చివరధ్వనివలె వినుపించె. దీనిని ఓం లాగా వింటూ తదేకధ్యానములో యుండగా నిరామయమే అయ్యె. చిక్కళలు గాంచగా చివరకు లీలగా బంగారు చాయగా, తెలిక నీలిచాయగా దోచె. సూక్ష్మ మహా జ్యోతి తోచె. ఆనందమే. అయోమయముగా నుండె. నిరామయమే అని నమ్మకమగుచుండె. తెల్పువారు లేరు. ఎవరిని అడుగుదామనిన, మనసు ఉత్సాహపడదు. ఈసాధన లన్ని ముద్రలన్ని సంకల్పము వున్న వున్నవి. లేకున్న లేవు. అన్నిటికి మూలము నిరామయమేమో అని అనుమానము కలిగె. కాని ఎవరిని అడుగకపోయె. తనలో తానే నిర్ణయించుకొనె. తారకలక్ష్యములలో దేవుని తనను ఎడముగా చూచుకొనుటే. ఇది

గాక జీవరాసుల కంటి పాపలబట్టి ఆదివ్యకాంతియే యేదానికి తగినట్టుగా దానికి కనిపించుచున్నదేమోనని భావించినాను. నిజ మనినమ్మినాను. భావమభావమయ్యె. ఇంకొక మార్గమున్న దా అని యోచించె. కొన్ని గ్రంథాలు చూచుట సాగె.

పంచీకరణముచూచె. ఇంద్రియాల నిర్మాణం ఎటిగె. వీని అన్నిటియెటిగే జ్ఞానం నేను అని తేలె అయి తే గ్రామఫోను పాటలాగా యీ దేహం యింద్రియాలు జ్ఞానసత్తా వల్ల ఆడు చున్న వేమో అని అనుమానించె. ఇదేగదా జ్ఞాత. ఇది నామ రూపక్రియలు లేకుండావున్నది గదా. అదిగదా గొప్పది. అది యెందుకు శివుడు గాదు. ఎందుకు నేను గాదు అని యోచించె. జ్ఞాత దగ్గఱ అనుమానము కలిగె. ఆకాశము నిర్మలమే. రూప ము లేనిదే. ఇది యేలాపగులుతుంది. ఎట్లు అర్థభాగమై జ్ఞాత అవుతుంది. జ్ఞాత ఒక్కటే. అదే నేను. అది ప్రపంచమంతా వున్నది. నేనదియని ప్రపంచమంతా అన్ని జీవరాసులలో అంతే అని అదే నేనని నేను నిండియున్నట్లుగా భావించె. జగత్తంతా నిండినట్లయినా, నిరామమయ్యె. జీవుడు కనుపడ లేడు. జ్ఞాతే అంతా నిండివున్నది. దాని కదిలిక లేదు. లోకాలంతా నిండి వున్నది. దానికి చావెక్కడ. పుటుక యెక్కడ. ఎట్లు సంభవిం చును. గ్రంథాలలో చావులు పుటుకలు నిర్ణయమున్నదే ! ఏది అబద్ధం ? జ్ఞాతకు కులములేదు. మతములేదు. చరాచర జగత్తుకల్లా అదేకారణమని నిశ్చయించె. ఆ జ్ఞాత యీ లోక ములో బొమ్మలనిండా యున్నది. నాయనుభవమెంతో ప్రతి జీవియనుభవ మంతేగదా—అది అహంకారము. కలవచ్చినప్పు

డుండే బొమ్మలనిండా లోకమంతా నిండివున్నది. ఆ బొమ్మల లో ఒకబొమ్మ అహంకారముచేత యితరము వేరుగా చూచు కొనుటేగాని వేరుకాదు. ఆలాగే యిప్పుడును. ఆ అహంకా రము నేను. యీ లోకమంతా ఉన్నాను. ఈబొమ్మతోచి యీ జగత్తుతోచగా, యీబొమ్మ నేననితలంచి అన్నిటిని వేరు గా చూచుచున్నా నేమో అని అనుమానం కలిగింది నేను అహంకారమైతే, యీ బొమ్మతోగూడి యీలోకముచూస్తు న్నాననుకొనె. కూడియుండుట యెందుకు. ఈ లోకాలు ఎక్కడనున్నవి. కలలో ఆబొమ్మ సంకల్పం తోచడముగదా. ఆలాగా యీబొమ్మ యీ లోకమే[illegible] [illegible]త్రతారని ఆలోచించుచూ యున్నాను. ఇన్నితిప్పలు నాకు నేనే పడ్డా. ప్రాహాచొప్పున విచారించుకున్నా. ఇదంతా[illegible]ను అని పట్టుపట్టి, భగవంతుని నాలో కట్టివేసితేగాని, గతి[illegible]. అని, 5 సవంత్స రములు గుణములు మార్చుకొనుచు యిహలోక పరలోక సుఖ ములు వదలిపెట్టి ప్రార్థన చేసినారు.

ఇట్లుండగా నా ప్రాణమిత్రము సౌ॥చుక్కమ్మ యొక్క కుమార్తె నా హృదయముపంటిది సీతారామమ్మ యీ కల నుండి మాయమయ్యెను — ఆలోచనలు స్తంభించిపోయెను. నిర్వికారమయ్యెను. అయోమయ మయ్యెను తీవ్రమైనదిగులు చేతనుగాని తీవ్రమైన సంతోషముచేత గాని మనస్సు పల్టీ గొట్టును అప్పటిదశ అయోమయ మయ్యెను — నిరామయ అనుభవమేనని అప్పుడు తెలియదు. చాలావిరక్తికలిగి పరమా ర్థమేగాక ఇకదేనియందును మనస్సు నిలవనిదయ్యెను — దెలి

యుటఎట్లు. దిగులుచే అయోమయమే — ఈ అవస్థలనే విమర్శించుకొనుట అయ్యెను. తీవ్రముగా విమర్శింపగా నదియేదశ ఇట్లవస్థపడుచుంటిని.

ఇంకా అనుమానములు కలిగె. బ్రహ్మానందము త్రాడుమీద పాములాగా, ఎండమావులలో నీళ్లులాగా లోకము అనిపించునని గ్రంథాలు చెప్పుచున్నవే అట్లయిన ఎండమావులనీళ్లు పాముతో చేవిగాని లేవుగదా. కొంచెము కొంచెము లేకపోతవా. పోతే తోచేదిఅంతా పోవలె. అలాగాయీజగత్తంతా ఆ నేననే అహంకారముమీద తోచిందేమో. అట్లా నమ్మేటట్టుగా వూహ అనిపిస్తుందిగదా. ఇందులో యీ లేని జగము నిలిచి, ఒక్కబొమ్మకు మోక్షమా అని అనుమానించె. నేననగా జ్ఞాతగదా. జీవుడు కాదుగదా, కాబట్టి నాకుబంధము వస్తే జగత్తంతా రావలెగదా. ఒకచిన్న దేహమే లా అవుతుంది అని అనిపించె. జగము లేనిదనుచు చచ్చేటప్పుడు బ్రహ్మలో కలవాలెనని జీవ సమాధులు కావలెనని యత్నించు సవికల్ప సమాధుల మార్గాలు దోష మేల కావని యోచించె? ఈ కనుపడే లోకమే కల్లయితే అనుమానించే లోకాలు సత్యమా అని గట్టి అనుమానము కలిగె, ఈ రహస్యం ఎట్లా తెలుస్తుంది. శివుడు గురురూపమైవచ్చి చెప్పునన్న పెద్దల వాక్యం నమ్మి భక్తిగావుంటిని. శివుడనగా సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపమే అనినమ్మియుంటిని. మాటిమాటికి సీతారామాంజనేయసంవాదము లోని— కనుమూసిన కనుదెరచిన ఘనసచ్చిత్సుఖ మయాత్మ గనుగొనకున్నం। కనుమూసిన

కనుదెరచిన । కనుపడు వెలిలో మనోవికారమె వత్సా —
అనునది మరపునకురాదు. దానిమర్మము ఏలా తెలుస్తుంది.
కానిహృదయము దిగులుచే నిండియుండె. ఆదిగులుచే గూడా
అయోమయముగా నుండెను. శివుడు గురురూపమైవచ్చె.
సంకల్పసిద్ధివల్ల ప్రత్యక్షమై గురుమూర్తియై నా యూహాల
గ్రహించు నా యూహాల నే రూఢిపరచుచు సంశయములు
దీర్చుచు కంటనిర్మాణము రంగులు పాపపరంజ్యోతి విషయమై
బోధించుచు స్వానుభవదశ నందించె. మనస్సుగంభీరమైలోకాల
నిండె. నేను సర్వాత్మగా తెలిసిపోయె. జగములు మనసుతో
తెలివితో తెలిసికొనేదానితో రహితమాయె. వచింపరాని
సంతోషముకలిగె. బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి—బ్రహ్మము
నుదెలిసినవాడు బ్రహ్మమేయని యొక యుపనిషత్తుల గ్రంథము
లోనుండె. అందుచే స్వానందదాయకుడగు గురువును బ్రహ్మ
ముగానేభావించితి. తృప్తియగుచుండె. కొన్నిసంశయముల
డిగితిని. శ్యామా మంత్ర రహస్యాదులు తెలిపి ఇట్లుబోధించె.
నీకు కలలాగా, ఆ నీకు యీ జాగ్రత కలలాగావచ్చినది. ఆ
నీవు లోకమంతా నున్నావు. లోకం నీలో నున్నది. అనిచెప్పె.
ఈ లోకమంతా నీదేహామే నీవేవిశ్వరూపమవు. అంతా నీలీల
యే యనితెలిపె. నిజమని గోచరమయ్యె. అంత హృదయము
శాంతమయ్యె. ఆ శాంతి అమనస్కము నిరామయ మొక్కటి
యే యయ్యె—ఈ బోధకువలయు పంచాక్షర అష్టాక్షరీ మహా
వాక్యాలు, పంచదశి షోడశి ద్వాదశుల శ్యామావిలాసరహ
స్యములు తెలిపె—అంతట తానాసుహా దహాంగ గముగా ప్రజ్ఞా

నముగా లోకమంత యున్నట్లుగా లోకము తనలోయున్నట్లుగా శ్యామా విలాసముగ భాపించుండె. ఆనందములో లీనమగు చుండె. బ్రహ్మానందమయ్యె. నిజమే. తెలుపున దెవరు? తెలుసుకొనేదెవరు? చిత్రమయ్యె. చిచ్ఛక్తి నాటకము శ్యామావిలాసము.

### 3. మాయా లీలా మహాత్మ్యం.

—•••—

కలవచ్చింది. ఆకలలో ఒక మాయాతరంగం వచ్చింది. అది స్వానుభవమును గుర్తిస్తు గురుధ్యానం చేసుకొని చెలిక త్తెకు చెప్పుచున్నది—మనస్సు నిలిపి తెలిస్తే సులభమే— మనస్సు యొక్క మర్మము తెలిస్తే సకలం తెలుస్తుంది. దానిని అణగ గొట్టాలనని ప్రయత్నిస్తే లాభములేదు. ఆ యోచించేది అదే గదా. అది ఏది అనుకొంటే ఆరూపాలన్నీ అది ధరించి, తనకు తాను వేరుగా నిలచి, చూచుకొని. నిజమని భ్రాంతిపడి అవస్థ పడుతుంది. కల అంతా అంతేగా. నేను ఆత్మనని భావించగా, నాయందే లోకమంతా ఉన్నది. యోచించేయూహ యీలోకం కన్నా గొప్పది కాదా. కాన ఊహే గొప్పది. అనుకుంటే కనపడే కల లోకములాగా, యీలోకము అనుకుంటునే కన పడుతుంది. లోకం నీలోనిదే అనుకొనే లోపలిదే. కాన కల లాగా మనస్సులోనిదే. ఇది చిత్రము. చాలా విచిత్రము. అన్ని వ్యవహారాలు, రూపాలు, ఆటలు, ఆరాటాలు. అంతామనస్సే. ఎండలో వేడిపొంగితే ఎండమావులు కనుపడుచున్నవిగాని లేవు. వేడి లేకపోతే పోతవి. ఈలోకాలు మనస్సుంటే ఉండును.

లేకపోతే పోవును. కలఅంతా మనస్సులోనిదే. అలాగా యీ జాగ్రతకూడాను. ఇదేగదా తెలిసేదీ ప్రపంచాలను. ఇదే తెలివి. నిలవరించి చూచితే మనస్సే తెలివి. లోకమంతా ఉన్నది. దీనిలో లోకమున్నది. పాఠం మారింది. పూర్వం ప్రపంచములో బొమ్మ. బొమ్మలో మనస్సు. ఇప్పుడు మనస్సులో ప్రపంచం. ప్రపంచంలో బొమ్మ. తలక్రిందులు. ఆశ్చర్యం. నిజమింతే. తెలిస్తే శ్యామావిలాసమే. కలఅతెలుసుకొనే దానిలోనేయున్నది. ఎప్పుడు పుట్టినది. ఎక్కడ ఆడినది. ఎక్కడ లయము. తెలుసుకొనే దానితోనే పోయె. ఎచ్చటికో. ఎచ్చటికి? మాయంకావడమే. మాయంటేయిదే. ఈ జాగ్రతకూడా అంతేసుమా. మాయాప్రపంచమంటామా! ఇదీ యీలాగా తేలాలెను. జాగ్రత ఆ మనస్సులోనే. మనస్సుసంకల్పమాత్రం. దానిలో యీలా కనుపడడమే. తెలివేయిది. తెలుసుకొనేది లేకపోతే దానిలో తోచుచు తెలియబడేదీలేదు. ఇక శేషము ఆదిశేషుడేగా. అదేగా నిరామయ నిర్గుణము. అనంతుడు. సంకల్పము లేకపోతే నిస్సంకల్పమే కదా. నామరూపక్రియా రహితమేగదా. ఈ తెలుసుకొనేది పరమాణువు. సూర్య చంద్రాదు లెన్నిఅయినా ఆ సూక్ష్మ కాంతికి చాలవు. మనస్సు తనలో లోకాలను చూచి వేఱని భ్రాంతిపడినట్లుగా సూక్ష్మజ్యోతి తనలో లోకాలన్ని చూచుకొని వేరనితలచి భ్రాంతిపడింది. నిరామయమందు స్వయం జ్యోతి పరమాణువుగా స్వయంభువగా నున్నట్లున్నది. సందు లేనిదానిలో కలవలె యీజగతు తోచింది. ఇట్లాఅనుకొనేది

అదే. నిజమెరుకపడె. తావేలేను జగమేది? రహితంరహితం. నిజస్థితి ఎరుగక వెతలుబడ్డామని ప్రగల్భములు కొట్టరాదట. కష్టమొక్కటికలదా. అదిఒకటే. అతిరహస్యముబట్టబయలు. పరమార్థంగాదా. మహాత్ములై శిష్యులకు సత్యమిది అని మనస్సుకు ఆనందంకలుగజేసి శిష్యులతో తాము ఆనందముతో లీనంగావడమేగదా. ఆనందమో బ్రహ్మానందమో. ఔనో కాదో చెప్పేవారేరి? శ్యామావిలాసానుభవాన చూడు.

అన్నియు అనిపించడమే. ఎవరికి. నాకే. ఎరుకార్థం. నా ఆటే తమాషా అయింది. నా పాటే పుస్తకాలయింది. భ్రమించా. చిక్కబడ్డా. తెలివిదెచ్చుకొనినిలబడ్డా. నేనువేరునీవువేరు అనితలిచా. ప్రపంచంవేఱనిసేవచేశా. ప్రపంచం నేనేనని సేవచేస్తున్నా. గురువుగా శిష్యుడుగా అనేక రకములుగా అనుకొన్నాను. అయినాను. అట్లా అనిపించడమే. మనస్సే నేనని ధృనపడతా. జీవుడనంటా. దేవుడనంటా నేనెక్కువ నీవు తక్కువ అని అంటా. తెలివి మఱపు లీనంచేస్తా. బాధము, ముక్తిలనిఅంటా. ఏమిలేదంటా. నేనుబ్రహ్మమంటా. అచలమే ఆసలంటా. అఅనుకోవడమేలేదు. నేనేలేదు. నాలోనిజగములిక నెచ్చట? ఇదియే శ్యామావిలాసము ఇకఏమున్నది? ఆమోమయమనో నిరామయమో ఏమో అనితలంచితే బ్రహ్మానందమే నిలువబడి ఔనని కాదని చెప్పేదేమి? అనుభవము అంటేఎవరికి? శుద్ధతెలివికి. గురుజ్ఞప్తికి. ఇదంకారానికి కారణముగా నిరాకారానికి కార్యంగా వున్నదంటా. కాదుకాదు అట్లా అంటే నిర్గుణానికి గుణమున్నట్లు కాదా. కాన

నిర్గుణం అంగానే అచలంగా ఉన్నది. నేనున్నట్లుగా నేనే స్వయంగా తోచాను. స్వాయంభువనని తెల్సుకొన్నా. ఔనా కాదా అంటే, నా అనే అనుభవం పొంది చూడమని అంటా. ఎవరితో నా యింకో రూపముతో. అది అంతా నా ఆటే నా వాటే- తలచి పొంగి పోతా- ఎక్కడికి కలలో లోకం ఎక్కడికి పోయిందో చెప్పితే చెప్పుతాను అనిఅరుట ఎవరితో నాలో నాలోనే ఆట చిత్రం విచిత్రం రహితం రహితం అనే భావం,లయం అయింది అయింది. ఏమయింది. చిచ్ఛక్తి య నెశ్యామావిలా సమయింది. ఈజవాబే తమాషా. గురువుగా, గురువుకు గురువుగా, శిష్యురాలిగా అనేకంగా అయినా. కానా-కాదు. అనుపించుకొనుచున్నాను. అనుకొనే భావం తొలగి లయం—ఎన్ని చిత్రాలురా నాయనా.

కలలో కల మిక్కుటమై పోయె. మందిగా రాను. తమాషాలు చెయ్యను. తంత్రాలు చెయ్యనూ. పోను. శ్యామ ఏమిచేసిందంటే. ఒక దేవుడుగా దేవిగా వచ్చె. కొన్ని ప్రసంగాలు వచ్చె. అంతట దేవుడేమన్నాడంటే, ఇది తా ఏమిటను కొన్నావు. పుట్టుట లేదు. చచ్చుట లేదు. తోచుట,పోవుట, నాకు స్వభావం. అసలు జగత్తే లేదు. నీవు లేవు. నేను లేను. ఇది తెలుసుకోవలంటే హృదయపూర్వకంగా భగివంతునిగా ఒకరిని తెలసినవారిని, చూచుకొని, అనగా అతడే గురువు. అతడు మనకంటికి మనస్సుకు దేవుడుగానే యుండవలెను. అట్లు కనబడవలెను. తర్వాత శ్రద్ధగా ఆత్మవిషయం వింటూ వుండాలె. తర్వాత యిట్లా చెప్పుచూ,ఏమిచెప్పినాడంటే-జ్ఞానంకలిగి, నేను.

అనునదేది, అని విచారింపగా దేహం కాదు. ఇంద్రియాలుకావు మనస్సు కాను నా దేహం, ఇంద్రియాలు నా మనస్సుని గ్రహించే జ్ఞానాన్ని. ఇదే తెలివి. ఆతెలివే నీవు. అది మనోతీతము. దేహము ఇంద్రియాలయొక్క నామరూప క్రియ గుణములు తెలుసుకొనే తెలివికి లేవు—నా మనస్సుని తెలుసుకొనే నీవు, మనస్సుకు అతీతముగా వున్నావు. మనస్సుయొక్క సుఖ దుఃఖములు గుణములు దానికి లేవు. మనస్సుయొక్క గుణములు మనస్సును తెలిసేదాని కుండవు. నీకు నామ రూప క్రియలు గుణములు లేవు. ప్రతి జీవరాశిలో దేహం మనస్సు తెలివి యీమూడే ఉన్నవి. అన్నిటియందుండే తెలివికి నామ రూప క్రియ గుణములు లేవు.

ఆ తెలివి పంచభూతములన్నిటిని తెలియుచున్నది. పంచ భూత గుణములు దానికి లేవు. అది పిపీలికాది బ్రహ్మపర్యంతం అన్ని లోకాలలో అన్ని చోట్లను ఉన్నది. ఆకాశమే అన్ని చోట్లావున్నది. ఆకాశమును తెలిసే యీతెలివి అంతటా వున్నది. ఈప్రపంచముపోయి కలప్రపంచమువచ్చిన అందులో అంతటవున్నది. కలపోయి సుషుప్తివస్తే అచ్చట లోకాలు రూపాలు లేవు. ఈతెలిసే గుర్తున్నది. ఆ తెలిసేది తెలివే. అది వున్నది. ఉండకున్న గుర్తు లేను తెలుసుకునే తెలివున్నది. ఈజాగ్రత ప్రపంచమున్ను స్వప్న ప్రపంచమున్ను వున్నా లేకపోయినా ఆ తెలివి వున్నది. అదే నీవు. ప్రపంచమంతా వున్నది. నీలో వున్నపీ జగము. ఇదే ఎరుక. లోకం ఎరుకలో వున్నది. ఎరిగిన వున్నది. ఎరు

కున్న లేదు. ఇట్లా యోచించి నీవు లోకమంతా వున్నట్లు వూహించి వూహ లేక లోకం లేక ఆనందంకావలెను. ఈదశలో నేను అనువూహధ్యానం లేదు. దాంతో ఏమీలేదు. జగాదు లున్నా శ్యామా విలాసంగ నున్నట్లుండుటే. ఇదే తెలియాలె,

ఈ ఎఱుక అణుమాత్రమై పాపలందు తళతళాయిస్తూ వున్నది. నీవు యీదేహం తగిలించుకొని యీలోకం–స్వప్న దేహం తగిలించుకొని స్వప్నలోకం - చూస్తున్నావు. స్వప్న దేహం లేకపోతే స్వప్నం లేదు. ఈ జాగరదేహం లేకపోతే జాగరం లేదు. స్వప్నదేహం స్వప్నలోకం ఆ లేని దశలో లేనేలేవు. ఈ జాగరదేహం యీ జాగరలోకమున్నా యీ జాగరదేహం లేకపోతే లేవు. కలదేహంతో కలచూచినట్టుగా ఈ జాగరదేహంతో జాగరంచూస్తున్నావు. కలలో ఆ దేహం ఆ లోకం చూచి నమ్మి గట్టిగావున్నదన్నట్లు యిప్పుడీ లోకం నిజమంటావు. కలలో బొమ్మలనిండా నీవున్నావు. పాపలలో కుండా చూస్తున్నావు. ఆకలంతా తెలుసుకొనే దానిలోదే. తెలుసుకోవడం అనుకోవడం రెంటికి వారేమిటి? ఒకటే. ఆకల లోకం కాంతులు దానిలోనే. అది సూర్య చంద్రాదుల కన్న కాంతి కలది. పాపలలో తళతళాయిస్తూ అన్ని బొమ్మల నిండా వున్నది. ఆలోకమంతా స్వల్పంగా అనుకొనే కాంతిలోనేగా! మెలుకువలో తెలుస్తుంది. ఆ అనుకొనేది తెలిసేదేగా నీవు. అదేగా పాపలలో నిలతోయద మధ్యస్తమయింది. అది పరంజ్యోతి. తెలివి. దానిలో యీలోకంఅంతా వున్నది. కలకు జాగ్రత మెలకువ. ఈ మెలుకువలోనుండి కల లేదన్నావు

నీవు నీవైనస్థితి యీ జాగ్రతకు మెలుకువ యైనది. ఆదశనుండి యీ జగత్తు చూడుము. ఆ నీయందే యీ లోకమంతా వచ్చింది. ఆ నీయొక్క దశను దెలియగా ఈ లోకం లేదు. కలలో కాన్పించే రూపాల కరణి జగము. ఇదే పదిహేనక్షరాలు. శ్యామాబాహ్య విలాస నాట్యము.

12. ఇట్లా కలతేలిన పిమ్మట నీవైన యీ పరమాణుదశ యందే యీలోకమంతా వున్నది. కల సూక్ష్మమైన మనస్సులోనేగా వుంది. అంత రవ్వంతలోనే వున్నది. ఈలోకము.తా పరమాణువైన ఆ అణురూప తెలివిలో వున్నది. దీనిలో సందు లేదు. సందులేనిదాంట్లో వున్నట్లుందీలోకం. తోస్తున్నది. తోచేది లేనిదేకాదా. స్వానుభవదశయందు మనస్సు మత్తుగా వుండి తెలిసినట్లుగా ఆనందంగా నుండి యేమో నిరామయాగా నుండును. ఇట్లా అని చెప్పేవారెవరు — అది అకళంకం— ఈ వృత్తబట్ట బయట ఏమీలేదు. ఇది పన్నెండు అక్షరాలు. ఇదే శ్యామానందదశ.

16లనిరామయమం దేమిలేదు. అట్లుండగా యీ తెలివి పరమాణువంత చిచ్ఛక్తి, ఎఱుక, స్వయాగా మహాత్మ గా తోచింది. తనలో ఆనందం పొంగేటప్పటికి, లోకాలు చూచుకొని, అన్నిటియందు తానుండి ఆటలాడుకొంటూ, చిత్రచిత్ర నటనలుగా ఉన్నది. పిల్లవాడి కానందావస్తే గంతులేసినట్లు జరిగింది. స్వానందానుభవంవలనగాని తెలియదు. కంటికి నల్ల అద్దం వేసుకుంటే నక్షత్రమండలందాకా నలుపు కనిపిస్తుంది. కాని లేదు. ఆలాగే ఆ పరమాణువందు లోకం తోచినను

బాహ్యానికి కాన్పించడమే, కానిలేదు. మనస్సులో కలతోచినా బాహ్యానికున్నలాగా కనిపిస్తుంది గాని లేదు. ఆలాగా యీ జాగ్రతలోకం కనపడుచున్నను లేదు—దీనికి యెఱుక మూలం — ఈ ఎఱుకకు మూలం లేదు. ఇది ఎరిగే జ్ఞానం. ఈ మూలా లేని గుర్తెరిగే శరీర మేమి లేదు. ఉన్నదన్నా మా అనుభవ పొందు. ఉన్నదేమో చెప్పు. చెప్పువారు వినువా రేరి? ఈ మూలంలేని గుర్తెరిగే శరీరమేమి లేదు. ఇది పదహారక్షరాలు. ఇది శ్యామవిలాసమూలా —

ఈ మంత్రాలతో తంత్రాలు తెలసి చిత్రాగా లేక పోతుంది—ఇదే నేను. నాలో అంతా వున్నదన్నట్లుగాతోస్తుంది గాని ఏమి పుట్ట లేదు. ఏమి చావలేదు. తోచుట పోవుట నాకు స్వభావం. అసలు జగత్తులేదు. నీవు లేవు నేనులేను. కంటికి పసిరిక అయితే ఎక్కడచూచినా పచ్చనైనట్లు భ్రమచేత ఎట్లా అనుకుంటే అట్లాకనబడుచేమే. ఇంకేమిలేదు. ఇదంతాకల్ల. ఈ క్షణములోవున్నది. మఱుక్షణములో లేదు. ఎప్పటికప్పటికిక్రొత్త జగత్తులే. కోటివి కాంతి ఒకటి. గిరిగిరత్రిప్పితే తీగ కాన్పించును. ఆ తీగె ఎచ్చోటా లేదు. ఎక్కడనున్న ఉన్నట్లుండుటే. క్రొత్తరాకడే క్రొత్తపోకడే. ఆలాగ యీజగత్తంతా క్షణము క్షణముకో క్రొత్తదే. క్రొత్తదే. కొత్తి ఆకేం. కొత్తిపాలె. అన్ని వింతలే. ఈ చిత్రమే శ్యామావిలాసం. శ్యామాస్వరూపమైతేగాని యీ విలాసమైపోరు. గీ। క్షణము క్షణముకు బ్రహ్మాండ చయములన్ని। పొందుచుండును, గురునిలో విందుగాను। కట కటా జీవుడూరికే కలకునోడు। ఏడ నున్నాడో

వానిదా జాడ గాంచ॥ అన్నట్లు గురువు అన్న యేగుర్తుదో అందులో క్షణము క్షణము క్రొత్తక్రొత్త జగత్తులే. క్రొత్త క్రొత్త వింతశ్రే. ఈ వింతను గాంచుచున్న నిరంతర బ్రిహ్మా నందం. జగాలు కష్టాలు సుఖాలు సెనిమా తెరపై బొమ్మల లాగా నగును చిత్రం. ఇదే ఇంద్రజాలం — యుగాలు సంవ త్సరాలు నెలలు రోజులు లేవు లేవు. అన్ని ఆక్షణములో అనిపించుట పోవుట. ఇదే వాడుక. క్షణము క్షణము అనిపించి పోయె. ఆ అనిపించి పోయే లీలా కాల చక్రంలో రెప్పపాటంత లో నే ఎ న్ని విచిత్రాలు ! ఎన్ని కోలాహలాలు ! ఎన్ని చింతలు! ఎన్ని ఆర్భాటాలు! ఇట్లు శ్యామావిలా సము నెవరు వర్ణించగలరు! అంతు లేని బ్రహ్మాండాల్లనియు పర మాణువులో నున్నట్లున్న తమాషా. లీల. చూడగాయేమున్న ది? ఏమున్న దందును! కలగదా. సముద్రము లో బుడగ బయలు దేరి, చూడు నేనొకసముద్రా న్నే అన్నట్లు;విశ్వమూర్తియైనసట నాస్వరూపమైన శ్యామావిలాసమయిన నాపెన్నిధానమైనజగ దేకరూపుడైన పరమాత్మయైన గురుమూర్తియందొక మూర్తి పలికి ఆడి యందులీనమగుచు తానేయదియయై ఆ తానుస్వాను భవదశయై లీనమగుటగదా! మాయమగుటగదా! యీలేని దానియందలి ఆనందలీల, శ్యామాలీల.

కలగాతలంచితే అచ్చమాంబాఅంటే 'ఆ' అనేకలవరిం తలో నీయనుభవమేమో వింటానువ్రాసియిమ్మనికోరినటువంటి శ్రీయుత సౌ॥ప్రేమరాశియగు రామినేని చుక్కమ్మ గారను నాప్రాణమిత్రము కోర్కెదీర్ప యిట్లువ్రాయుట జరిగినది. అను

టకు వ్రాయుటకు వినుటకు యింకొకరేరి. ఈ మొక్కపాటి అచ్చమాంబ ఏది? పురుష ప్రకృతులు రెండు విడిచియుండవు. వున్నను యేకరూపం. తోచెడా లీనం. తోచదా. లీనా లీనము గాదు. రహితం. రహితా. సదానిరామయ పరిపూర్ణమే కలదు. ఇట్లని యానందముగ చెప్పువారెక్క తొంత సేపటినుండి కలరు! ఆది నిరామయమని నిరూపించుటెట్లు! ఎవరికి? ఎచ్చట? ఉన్న గదా? సర్వం సద్గురోర్పణమస్తు అనినను సేవారెవరట? ఏమో ఏమో యని గంభీరించి యానందించుకే. —శ్యామావిలాస మెరుంగువారికే చిద్విలాసానందా. ఓం శాంతిః.

## తత్వములు

౧.

ప. తల్లి రామాయమ్మనందన—తండ్రి యోగిభూషణుండు
కొంగి ప్రేమబోధ నంగ। జల్లువారు జగతిలోన ॥ప్రల్లి॥

1 నెన్ను వాగిసురిల నెల్ల। మిన్నగనే సద్గురుండని
సన్నుతించెద నన్ను ప్రేమ। నెన్నడు ఏమరకి మనెను।

2- ఎఱుకయందు తోచునంత। ఎఱుకయందు నాను అంతె
ఎఱుకయందు పోవునంత। ఎఱుక తాను రహితమనెను।

3- కిరి దిన్నా వెలగపండు। సరిగాగా యీ విశ్వమంత
ఎఱుక లేక తోచి తానే। జరుపు లీలానాట్యమనెను॥

4- అన్ని ఇన్ని యనగనేల। ఏన్నివింతలైన నాకు
వన్నెవన్నెల లీల లట్టే। కన్ను మూసిగి పోవునసెను॥

5- మొక్కపాటి అచ్చమాంబ। మొక్కపోవని మోక్షవిధానె
సౌఖ్యమ మాలోనయుంచు వక్కవ చూపించె మనసునెను॥

౨.

ప. అక్కలారా- అందరే । మక్కువాతో మ్రొక్కెని ॥అక్క॥

1- చుక్కవలెను శుద్ధమందున । చక్కగాను దోచుచుండిన
ఒక్క వెల్గులోన యుండె । మక్కువుంచిన మహితలంబు

2- గురుమూర్తి కరుణచేత । పరమాణు రహస్య మెఱిగి॥
వరలుచూడిన స్వప్నరీతి । జరుగుచుండెను జగపుగుట్టు ॥

3 నీవు మెవరో నీవు దెలసి । భావభావమందలి జగములెరిగి
నీవ దేవల చింతలుడిగి । భావాభావపరముగనుము ॥

4 సాటిలేని ఎఱుకయందు । ఎందులేని జగములెల్ల ।
సందులేని అచలమందు । విందుగా దోచును యెఱుక॥

5- నివు ఎఱుకనంచు నెఱిగి । నీవె లోకమంచు నెఱిగి।
నివిగానె యాటలెఱిగి । భావమంచి భావముడుగు॥

6- ఆదిరాజు తిరుమలార్యుని । పాదామృత భృంగస్వరూప
మల్లాని నాగభూషణు । బోధామృత పానిగమ్మ॥

7 మొక్కపాటి అచ్చమాంబ। మొక్కి మీకు దెలుపుచుండె
చక్కసి మార్గంబుగాంచి । పొక్కిడి బ్రహ్మానందమందు

౩.

ప. ఉన్నదే పరిపూర్ణము । ఉన్నదనే । దెన్నటికీ సున్నానుడి।
అన్నది విన్నదిగాక ।ఉన్నదే పరిపూర్ణమంచు ।నిన్ను దెలిపే
గురుని జేరి। విన్న నీ సంశయముతీరు ఉన్నదే॥

1 బట్టబయలున్నదిరా। పుట్టి గిట్టదు। చుట్టువలె కదలాదురా॥
మొట్టమొదలు లేని యెఱుక । పుట్టి పేరుపెట్టుకొని । చిట్ట
చివరకు లేకపోవి । గుట్టు గురు డిటనుచు దెలిపెర॥

2 కొండమీాదనుగుండురా।గుండునడుమా।కండ్లు రెండున్నవిరా।
కండ్ల నడుమనున్న సన్న । గండిలో పండనుభవించితే। దండి।
గ ప్రజ్ఞాన మా।యుండవై నీ వుండగలవు॥
3 చూపులో నీలమురా । నీలమున । దీపమున్నది చూడరా
దీపమందు నున్నకళను । తేపకు నీవనుచు దెలసితే ।
తాపములు కడద్రోసి నీవు। తత్వమసి వాక్యార్థమౌదువు॥
4 ధాత్రిలో గాత్రమురా । గాత్రమున చిత్ । జ్యోతి యున్నది
చూడరా ॥ నేత్రద్వారా మందు గురుని । సూత్రము నీవె
రిగినపుడె। పాత్రమౌదువు బ్రహ్మా। వాహామస్మి నిజమురా॥
5 పంచ భూతము లైదురా । ఎంచి చూచితే । పంచ వింశతి
యాయెరా॥ సంచిత ప్రారబ్ధముల ద్రుంచి చీకుల సాంబగురు।
డుంచితముగనయమాత్మ బ్రహ్మాంచు శ్రుతివాక్యంబు దెల్పె
( ఇది నోరి రాజయ్య గారది. )

ఓం.

శ్రీయుత మల్లాది వెంకట నాగభూషణంగారు చేసిన

శ్యా మా స్త వ ం

క ॥ అమలంబు నందు బొంగియు । విమలంబౌ శక్తి యాచు
వివిధాకృతులై । భ్రమగొని భ్రమ పొందక, విశ్వముగా
జరియించుచున్న సంవిదశ్యామా ।
క ॥ అతిసామీాప్యస్థలిని నెలతగ బురుషమూర్తిగా గొలది
దూరమునన్ । అతి దూరంబున రూపరహితముగ దోపించు
నో మహేశ్వరీ శ్యామా॥
క ॥ 'శ్రీ' యన చిచ్ఛక్తాయెను । 'ఆ' యన సర్వజ్ఞడాయె ;

అన ' మా ' జీవుండాయెను, మాటమియే। శ్యా। మా
యెను, నీ నాట్యమాయె మర్మము శ్యామా॥

క॥ కోరినవారల కోరిక। నేరుపుగా దీర్పనెంచి నిఖిలమునందున్।
వారలకు వీలు గలిగెడు । దారుల బొడజూపి కాచు తరణే
శ్యామా॥

క॥ గోటను గాలికి గాయము।వాటముగా దగిలియున్న బరికించి
యుదా। గోటను గోటని దీసెడు। సూటిగ దుష్టులను
దూల్చుజ్యోత్స్న శ్యామా॥

క॥ ముక్తిని గోరియు నత్యాసక్తిని రోసియును ఘోరసంసార
మునన్। శక్తి కొలందిని గొల్చెడి । భక్తుల రక్షించు
ముక్తిపదమా శ్యామా॥

క॥ నేనన నేమని తెలియగ। బూనిన విజ్ఞానికి గురుమూర్తిగ
నీవే । గానగ వచ్చియు నీవన। నేనన జ్ఞానంబటన్న
నిర్మల శ్యామా॥

క॥ నేనన నీవన నొకటే। మూనని భావింపుచుండి యాత్మోప
రతిన్। మేనుల నాటకమాడెడ। యానందమయాత్మ దేవి
యమలా శ్యామా॥

క॥ నీనయనాబ్జాబులలో। నానీలఘనా తరస్థమైన మెఱుపనన్।
మానితమా ప్రేమ జిలుకు। నీనిర్మలవీక్షణాల గణించెద శ్యామా॥

క॥ ఆమూలాత్మానుభవము । నామూలాగ్రంబు దెలిపి
యానందమతిన్। ప్రేమనువర్షించెడియో। భౌమానందాత్మ
దేవి ప్రమదా శ్యామా॥

క॥ హృదయం బేకంబెనను। ముద మారగ నన్నుజూచిముకొ్క

ను। ప్రేమన్ మొదలింటికోర్కె దీర్పుచు విదితజ్ఞానుభవమిచ్చు
విమలా శ్యామా॥

క॥ నీమదియందున డిందగ। నామది యానంద పరవశాత్మ
యెయయ్యెఁ। ప్రేమానందంబొ విమల। భామానందంబొ
చెల్పవశమా శ్యామా॥

క॥ నిను బొడగాననిచో మది। ఘనసంతాపంబుచేత గ్రాగుచు
నుండున్। నిను బొడగాంచినచో మది। ఘన బ్రహ్మానంద
వార్ధిగానగు శ్యామా॥

క॥ పరులై గురుశిష్యులునై। ధర సోదర సోదరీవతంసములై ధీ
వరులై దంపతులై సుం। దరులై పురుషప్రకృతీ పథాత్మ
శ్యామా॥

క॥ రామంబై కృష్ణంబై। ప్రేమంబై ధీయయి సువివేకంబై శ్రీ
ధామంబై నేనై స్వామీ మహితంబైన నీలమేఘశ్యామా।

క॥ శ్యామానామమె మంత్రము। శ్యామాహాసాసుచంద్రికానం
దంబా। శ్యామావీక్షణె లక్ష్యము। శ్యామాకూటమియె
మోక్షసామ్రాజ్యంబా॥

తత్వము.

ప॥ గురుదేవా। గురుదేవా! గురుదేవా। నీ॥ చరణాబ్జమునే
ధరియించెద నాహృ। త్సరసీజమునందు। నా॥

1॥ దేహంబునవ్వా॥ మోహాము విడచీ। ఊహాపోహాల। నడచీ।
ఊహాతీతంబా। హాంస్ నేనను। ఊహాధ్యానము। గడచీ॥

2॥ నేనూ నీవని। పూనిన నాయభి। మానము నొకచో డించీ॥
ధ్యానమేమె। మేనూ మరచితి। నేనే నీవని। ఎంచీ।

3॥ నారూపము మరి। నీరూపము నేకా। కారము గాను తలచీ।
కోరియు ప్రేమ। పూరిత నిరా। కారముగాను। నిలచీ॥

4॥ కలయందున నా। తలపందున వే। చలియించు జగముల।
నెరిగీ। కలియుగకల్మి। తెలియగజాలు। తెలివి గమకించి
మరిగీ॥

5॥ మీాటిసంశయము। వాటముగా గురు। కూటమి సూటీ। చేం
ఆటపాటల। తోటి యానంద। ధాటిని ఎరుకను। మీా॥

6॥ సల్లాపసరణిని। చల్లనిబోధల। కొల్లగ జెంప్పు। వీరా।సల్లలి
తాత్మ। మల్లాది భూషణు। యుల్లము యిచ్చె। ధీరా॥

7। ఇరువుర మొక ఝైన। పరవశ మై ధీ। సరసిజ మెగిరె। హాయా
అరమరవీడితి। పరిపూర్తి నంగితి। తిరుమలసద్గురు। రాయా।

8॥ ఇదె గురుశిష్య। పదవుల మర్మ మెదయందు నిల్పితి।
వయ్యా। సదయాంతరంగ। హృదయమర్పించెద మరిలయిం
పగోరితి। నయ్యా॥

మం గ ళ హా ర తి.

ప। హా_రా తీ- తిర్మలరాయా। మంగా ళారాతీ నైకొనవే।
అచల గురురాయా॥

1। యోగియోగాంగ సం। యోగములెరిగి నుగ్యోగిములని
మాను యోగిరాట్చంద్రా।

2 తారక సాంఖ్య సం। చార రహస్యముల। దూరిము ముక్తి
కను। సార సారజ్ఞా॥

3। ఎందు జూచినా కొక్క। చందమె సచ్చి దా। నందమును నిజా
నంద యోగిశా॥

4॥ కోమల హృదయులై। ప్రేమపూరితులై। శ్యామాపిలాసంబు। గామించు మను దేవా ॥

5॥ పరిపూర్ణమెరుకల। ఎరిగించు ఎరుకెగుర పరిపూర్ణమే యను। గురుతో గురురాయ॥ ।

6॥ కల్ల యీ సర్వేశును। మల్లాది భూషణ। యుల్లము చెందుమ హోల్లాసరూప॥

ఉ య్యా ల పా ట

ప. ఓం నామశ్శివాయ। స్వానుభవసూత్రము మానక ఊగునే ఉయ్యాలా॥ ఆనందమయశివుడు జ్ఞానాత్మశ్యామతో। తానూగుచున్నాడె ।జంపాలా॥ తానెయై లీనమౌ నుయ్యాలా॥

1, శుద్ధతెలివిరూపై ।శూన్యమౌ మాయ। ప్రసిద్ధమై లోచెనె। యుయ్యాలా॥ నిద్దంపుకాంతులు। నిజప్రకాశంబున। ముద్దులు గుల్కునే జంపాలా ॥హద్దులు వీడునే ఉయ్యాలా ॥

2. మూడురీతులపొంగి।మూడురంగులుపొంది।మూడుశక్తులాయె నుయ్యాలా॥ మూడుకోనలగూడి। జోడుబాయక తాను।ఆడుచు నున్నదే ।జంపాలా॥ వీడుచునున్నదే ఉయ్యాలా॥

3. మించిపొంగుచు వే। యంచులచక్రమ్మో। పంచభూతాలయ్యె నుయ్యాలా॥ పంచభూతాల లో।యంచులగూడి ప్రపంచము లయ్యెనె। జంపాలా॥ కించిత్తులాయెనే ఉయ్యాలా॥

4. ఇలజలాగ్నివాయువు। లెలమితో కోల్లాయె। సంకదిశల్పట్టెనే ఉయ్యాలా॥ నులక యిరువదినాల్గు। మెలికలు తొట్టికి ।నిలిపిరి మనసుతో। జంపాలా॥ కలిపిరి మనసుతో నుయ్యాలా॥

5. పవలురాత్రులను స్తంభంబులను నిలిపి। బయలుదూలవేసి

రుయ్యాలా॥ పవనంబులను రెండు।పగ్గంబులుగ జేసి। పదిలముగ గట్టిరి। జంపాలా॥ వదులుగ గట్టిరి ।ఉయ్యాలా॥

6. ఆధార స్వాదిష్ట। మణిపూరకమలాలు। ఈదిక్కు—పూజా లే ఉయ్యాలా। అనాహత విశుద్ధ। ఆజ్ఞేయకమలాలు। ఆదిక్కు—పూ జా లే। జంపాలా॥ లోదిక్కు— పూజా లే ఉయ్యాలా॥

7. ఎఱుపు తెలుపు నలుపు। నీలంపురంగుల। పఱుపులే పరచిరి ఉయ్యాలా॥ ఇరుయొకటి యండాలా। మొరసి దిండ్లగ జేసి। ఇరు ప్రక్క—లుంచిరి జంపాలా॥ చిరుప్రక్క—నుంచిరి ఉయ్యాలా॥

8. పలు చిత్ర—ళలతో। పదినూర్ల రేకుల। చిలుకల పందిరే ఉయ్యాలా॥ వెలుగుచు మధ్యలో। వేగుచుకోటి—కోటి। శిలకించు జగముల జంపాలా ॥ కులికించు జగముల ఉయ్యా ్యలా॥

9. పైన వ్రేలుచునున్న। తేనెతుట్టెనుండి। సోనలు కారెనే ఉయ్యాలా॥అనుచు జీవుండు। ధ్యాననిమగ్నుడై। ఆనందమయు డాయె। జాపాలా॥ లీనమై రహితమూ ఉయ్యాలా॥

10 చూపులోనే చూపు। చూడంగ చూడంగ। రూపుల జ్యోతియే । ఉయ్యాలా ॥ ప్రాపంచములు తన । లోపల వెలుపల। తోపించుచుండునే। జంపాలా ॥ తోపించుచుం డునే। ఉయ్యాలా ॥

11 పంచ లీలాకన్య । లంచిత భక్తి నూ।గించుచునుండిరే ఉయ్యాలా ॥ పంచీకరించి తా।మంచు మోచించి। పొంచు। చుడిందిరే। జంపాలా ॥ మించి లయించిరే ఉయ్యాలా॥

12 ఆతట్టు యీతట్టు। ఏతట్టు చూచిన। మూతలుమూగెనే ఉయ్యాలా ॥ నూతిని గనిపెట్టి । ఈతలు వెయ్యంగ ఏతట్టు

లేదాయె । జంపాల ॥ సూత్రమే లేదాయె ఉయ్యాలా ॥
13 ఆచూపు ఈచూపు । ఏచూపు చూచిన । తాకాపుగా
నయ్యె । ఉయ్యాలా ॥ లోచూపు చూచుచు । ఆచూకి
తియ్యగా। తాకాపుగాపెయ్యె । జంపాలా॥ ఏకాపు లేడాయె
ఉయ్యాలా ॥
14 చేను కాపునుగూడ । లేనిచోటనునంత । లీనమైపోయెనే
ఉయ్యాలా ॥ లేని యూవార్తను । లీనమావార్తను। లేనిదే
చర్చించు । జంపాలా । లేనిదే లీనమా ఉయ్యాలా ॥
15 ఆదిరాజు ఓర్మిలార్యని దివ్య।పాదంబులతోడ। ఉయ్యాలా॥
మోదాత్ముడై మల్లాప్ర భూషణుం । డాదియై లీనమా ।
జంపాలా ॥ ఏదియు లేదాయె । ఉయ్యాలా ॥

## తత్వములు.

ప॥ ఒంటిగనుండే।సద్గురుమూర్తి। కంటిగానున్నాడే॥ఒం॥
1 మనసుమేచేయగ మనస్సునందున మగ్నత చెందాడే॥
2 కదలక మెదలక! జగత్తులెల్లను। కాంతిలుచున్నాడే॥
3. పంచభావంబుల। పంచభూతంబుల। మించియు నున్నాడే॥
4. దశేంద్రియంబుల। దశలమీరి పర। వశమై యున్నాడే।
5. కన్నులలోపల। కనకమయంబై। తిన్నగనున్నాడే॥
6. అల కర్పూరపువెలుగున వెలుగై। వెలుగుచునున్నాడే॥
7. కోమారి మఠమున । పరశివానంద । స్వామై యున్నాడే॥
8. మల్లికార్జునగురు । మానుషై యడ్లపల్లిలో దాగాడే ॥
9. పంచవర్ణంబుల । పూలతోడ పూజించగవేరా రే।
10.। సేమును మంగారి । రామారత్నము। భామాబైనాడే॥

## మంగళహారతి.

ప॥ రహిత రహిత మంగళం । సర్వారాహిత్య మంగళం ॥

1 శ్రీకాంతునకు నుమాకాంతునకు । బృహద్వాశిష్ఠప్రవక్త వసిష్ఠునకును । శ్రీరామలక్ష్మణా శ్రీకృష్ణార్జునులకు వరలిన సద్గురు పరంపరకునూ ॥శ్రీ॥

2 శ్రీమించివెలిగేటి శ్రీధరస్వాములకును రాముడు శివరామా ప్రాయ గురువులకు త్యాగిగా సీతరామస్వామికి నల । భాగవత శ్రీకృష్ణదాస గురుమూర్తి

4. ఆదిరాత్రిరుమల రాయాగ్రగణ్యులకు। మల్లాది నాగభూషణ గురుమూర్తికి । బోధస్వరూపు తాబోధకు లందఱకును । మోనిగా శేషురాజర్షించుచున్న ॥రహితం(

సంపూర్ణము.

# గీతామృతము.

మామూలు ప్రతి **0-2-6** క్యాలికో **0-4-0**

శ్రీకృష్ణభగవానుడు ఉపనిషత్తులను గోవులనుండి పిండిన క్షీరసారమే ఈ గీతామృతము. ఐహిక, ఆముష్మిక సుఖములొసంగుటకే నిష్కామ యోగమును ఆ కురుక్షేత్ర సంగ్రామమునందు అర్జునుని నిమిత్తమాత్రముగా చేసికొని మానవలోకమునకు చాటిన ఉద్బోధము. భగవద్గీతను వచనకావ్యములో మేము నూతన పద్ధతిలో మృదుమధురముగ ఆమూలాగ్రముగ నూటయేబది పుటలలో చిన్ని పొత్తముగ తయారొనర్చితిమి. శైలి సులభము. భావము మధురము. విన్నవారు మరియొక్కసారి వినగోరెదరు. చదివినవారు మరియొక్కసారి చదువగోరెదరు. విద్యయా ఆధ్యాత్మవిద్య. యోగమా నిష్కామయోగము. లక్ష్యమా ముక్తి. ఆచరణమా పవిత్రము. ఆసక్తి అనాసక్తి. ఇట్టి లక్షణములతో గూడిన ఈ గీత నేటికి గదా తేటతెల్లమైన తెనుగువచనమున వ్రాయబడినది. వెలయా స్వల్పము. ఫలమా అధికము ! ప్రయోజనమా ముక్తి ! ఆ కురుక్షేత్ర రణరంగమందలి మధురగాన మాలకించుడు. అదియే ఈ గీతామృతము. నిజమైన మధుర గానమే ఈ గీత. దీనిని పఠించుడు. ముక్తిగాంచుడు.

## సుందరరాం అండ్ సన్సు,

బుక్ సెల్లర్సు, పబ్లిషర్సు, తెనాలి.

# జీవితరహస్యము

చక్కని అట్ట బైండు **వెల 0-5-0**

మన కంతయు దెలిసినట్లుండి, తెలియనిదే రహస్యము తాను అనుభవించు సుఖ దుఃఖములు, కలిమి లేములు, మున్నగునవి అన్నియు క్షణమాత్రములనియే తలంతురు. రైలులో బిచ్చమెత్తుకొను బిచ్చగాడును "పొయ్యేటప్పుడు వెంటరాదు ఒక పుచ్చిన వక్కయినా" అనియే పాడును. సకల శాస్త్రములు చదివిన పండితుడును "లక్షాధికారైన లవణ మన్నమె కాని, మెరుగు బంగారంబు మ్రింగఁబోడు" అనియే చదువును. ప్రపంచమును సన్యసించిన **యోగీశ్వరుడును** "ఉండబోదీ దేహము—ఓమనసా!- మేడిపండువంటిది ఆ మోహము" అనియే బోధించును. మానవుఁడు తనజీవితము నిత్యముగాదని తెలిసినప్పటికి నిత్యమని భ్రమపడుచున్నాడు. మానవుడు యేయే వేసముల దాల్చుచున్నాడో, యెన్ని రీతుల ప్రపంచమును మోసగించుచున్నాడో, గృహ, ధన, స్త్రీ, బంధములం జిక్కి యెట్లు సర్వశూన్యుఁ డగుచున్నాడో మున్నగు విషయములు అన్నియు మా "జీవితరహస్యము" నందు మంచి ఉదాహరణములతో వివరింపబడినవి. విమర్శింపఁబడినవి. శైలిసులభము.

## అన్ని రకముల పుస్తకములు దొరకును షాపు

# సుందరరాం అండ్ సన్సు

బుక్ సెల్లర్సు, తెనాలి.

